సంపుటము 5] జనవరి, 1919 [సంచిక 7

# బాలమిత్ర

## సౌఖ్యదాయకమగు నూతన వత్సరము

దేవుని దయ గొప్పది. ఆయన దానములు క్రొత్తవి అనునొక భక్తుని వాక్యములను మనము ఈ నూతన సంవత్సరములో జ్ఞప్తియందుంచుకొనుట మంచిది. మనము గతవత్సరమునందు దేవుడు మనకు జూపిన ఆయన కరుణను గూర్చి దావీదు భక్తునివలె ధ్యానించుట తగినదైయున్నది.

1919 సంవత్సరము లోకమున మహాగొప్పదిగా గనుపడుచున్నది. లోకమందలి అన్ని జనాంగములవారును లోకపు సమాధానముకొరకై సభలు జేయుచున్నారు. అట్టివారు జేయు యేర్పాటులు స్థిరమైనవిగానుండ మనము ప్రార్థింతము.

మహా భయంకర యుద్ధమును ప్రచండ మేఘమును కరువులు కాటకములను ఉరుము మెరుములును ఆగిపోవుటకై దేవుని వేడుకొందము.

ఈ నూతన సంవత్సరమున మరీమంచి బాలకులముగా నుండ యత్నింతము.

నూతన సంవత్సరపు దీవెనలతో దేవుడు బాలమిత్రులను నింపును గాక !



# కీర్తన సమాధానము

కమాసురాగము

నీ మహా మహిమనే మందు - నీ ప్రేమకవద్దికలదా
దేవ సమసపాయులు రమణమున - చీమలవగిదిని సమసిరి ప్రభువా
లోకమంత వెత - చీకటం మునిగ్రహా - నీ కరుణగడతేరె నిష్పటికి

2. తళతళలాడును - నలనక్షత్రము - తళతళమని మాకలత దీర్చెను
అలనిల జనులకు - నతిశయశాంతము - నొసగితివహో కరుణానుయాగ్రహా

# తల్లి, పిల్ల సంభాషణ



లూసీ, ఎతలమ్మ లేచి పాఠములను చదివి, తల దువ్వి సిద్ధపడి భోంచేసుకొని బడికివెళ్లనై యున్నది. నీ వింకా పడకమీదనే యున్నావు. త్వరగా లేచి సిద్ధపడి వెళ్లవే! సోమరీ!

లూసి.—అమ్మా! కడుపులో మంట పుట్టుచున్నది. ఆకలగు చున్నది. కొంచెము భోంచేసి వెళ్లవచ్చునా? అమ్మా! ఆఁ.

తల్లి.—మంచిది వెళ్లవే! కానియ్యవే త్వరగా! తలదువ్వి, ముఖము కడుగూ మరీ! అయ్యో కర్మమా!

లూసి—నేను చాలాసేపు బడిలో నుండవలెను కదా? నేను మరి కొంచెమన్న నెక్కువ తినవచ్చునా? అమ్మా! ఆఁ.

తల్లి.—మంచిది ఆలాగే అఘోరించవే, నీ యిష్టము వచ్చి నంత తిను. (ఎక్కువ తినెను.)

లూసి.—అమ్మా! కడుపు చాలా నొప్పి పుట్టుచున్నది. నేను బడికి వెళ్లలేనమ్మా. పంతులమ్మకు చీటి వ్రాయుము. (శెలవుకొరకు.)

తల్లి.—కొంచెము ఓమము తిని వెళ్లవే, సేద తెరుచుకొని, సోమరీ! తిండిబోతు! ఏమీ ఏడ్చుచున్నావు?

లూసి.—(ఏడ్చుచు) ప్రతిరోజు పంతులమ్మ నాతో లూసీ! ఎక్కములు నేర్చినావా? లెక్కలు వేసినావా? పాఠములు చదివినావా? అని అడుగునుగాని, ఒక్క రోజైన కడుపార భోంచేసినావా? అని అడుగలేదు. నేను వెళ్లనమ్మా!

తల్లి బుద్ధిచెప్పి శిక్షించి బడికి పంపెను. విద్యార్థులు యెక్కువ శ్రద్ధను విద్యయం దుంచవలెను గాని కడుపునం దుంచి ఎక్కువ తినరాదు.

అద్దంకి, దావీదు

---

## పిట్టలు చెప్పిన సంగతి

మనము రాకముందీయింటిలో నెవరున్నారో? వారెట్టివారో తెలిసినయెడల బాగుండును అని సుమిత్ర తల్లితో ననెను.

"నాకు కొంచెము తెలియును. కొంచెము కాదు చాల మట్టుకు తెలియును" అని తల్లి చెప్పెను.

"ఎట్లా తెలియునే. ఇంతకుముందెన్నడు ఈ ప్రాంతములకు మనము రాలేదే. ఎప్పుడైనా వారి దగ్గరనుండి ఉత్తరమైనా రాలేదే. నాయన ఈ యింటి యజమానునితో గదా మాట్లాడింది. నాయనకు అప్పుడీయింటిలో అద్దెకున్నవారిని గూర్చి తెలియదుగా" అనెను సుమిత్ర.



“అవును నీవు చెప్పినదంతా నిజము. మనము వారి కెన్నడు వ్రాయకపోయినా వారిని చూడకపోయినా నాకు వారిని గూర్చి చాలమట్టుకు తెలియును” అని తల్లి చెప్పెను.

“నీకెవరు చెప్పిరి?”

“ఎవరు చెప్పలేదు.”

“తమాషాగా మాట్లాడుచున్నావమ్మా! ఏమిటో చెప్పవూ?”

“నీ కన్నులు తెరచి, చెవులు విప్పి వాటి నుపయోగించిన యెడల చాల తెలిసికొనగలవు.”

“అరే! ఈ యిల్లంతా తిరిగిచూచితిని గదా. ఇక్కడ జరిగేదంతా విన్నాను.”

"గాని నీవు నిర్లక్ష్యపెట్టినది చాలగలదు."

అక్కడ తమకంటె ముందుగా నెవరుండిరో కనుగొన వలెనని సుమిత్ర చాల ప్రయత్నించెను. మరియు తన వంటి చిన్నపిల్లలెవరైనను ఆ యిట్లో ఉండిరేమో కనుగొన గోరెను. ఎన్నాళ్లు జూచినను తనకేమియు తెలియలేదు. ప్రతి ఉదయమును ఆమె లేవకముందు రెండు పిచ్చుకలు వచ్చి కిచకిచలాడి కిటికీపై నాలిగొంచెము సేపటివరకుండి ఆమెవంక జూచి తరువాత వెళ్లును. సుమిత్ర ఒకనాడు తల్లి దగ్గరకుబోయి తాను జూచిన సంగతిజెప్పి "ఈ ప్రాంతము లోని పిచ్చుకలు చాలమచ్చికైనవి" అని జెప్పెను.

తల్లి నవ్వి "అవి అంత మచ్చికైనవి గనుక ఏమనుకొన వచ్చును?" అని యడిగెను.

సుమిత్ర కొంచెము ఆలోచించి "నాకు తెలియును. ఎవరో ఒకరు వాటికి ప్రతి ఉదయము మేతపెట్టేవారు." అనెను.

"ఎవరా మేతపెట్టినది?"

"ఎవరో దయగలిగినవారు గాని మొన్న బాలప్రియను రాగానే ఎగిరిపోయిన వెందుకు?"

“ఎందుకో నీవే చెప్పు.”

సుమిత్ర కొంచెముసేపు తలంచి “ఎవరో నావంటి ఒక పిల్లవాటికి మేతపెట్టినది. మగపిల్లల నవి చూడలేదు గనుక వాడు రాగానే ఎగిరిపోయినవి. ఆ పిల్ల ఉన్నదికూడ నేనుండే గదిలోనే” అని చెప్పెను.

ఆ దినము మధ్యాహ్నము ధాన్యపు కొట్టులో గుడ్ల కొరకు బోవునప్పటికి ఒకపిల్లి పుర్ పుర్ మనుచు దగ్గరకు వచ్చి తోకాడించెను. ఆమె దానినెత్తుకొని దాని శరీరమును నిమురునప్పుడు దాని మెడలో నొకగజ్జె కట్టబడియుండుట చూచి, అదికూడ ఆ పిల్లకట్టియుండునని తెలిసికొనెను.

“ఆమె పిట్టలను పిల్లులను ఎంతచక్కగా ప్రేమించినది. ఆమె అట్లా ప్రేమించినందుననే యివినన్ను ఆమె అనుకొని నా దగ్గరకువచ్చినవి. నేనుకూడా వాటిని బాగాచూచినయెడల, నేనెట్టిదాననో ఆ సంగతి నా తరువాతవచ్చినవారి కవి తెలుపును. గనుక నే నికమీదట వారితో బాగాఉండి, వాటికి మేతపెట్టెదను అని” సుమిత్ర తలంచెను.

# పొఁగబండి పాఁట



పల్లవి

రైలనుతాఁనే పొఁగబండి యినుపదాఁరినిచూఁడండి
యినుపదాఁరిని పోఁనండి పొఁగయాఁవిరితోఁవెడలండి
బగ్, బగ్, సర్, సర్, చూఁడండి ॥

1. మిఠాయి నారింజ సీక్రెట్టు వెడలు, జట్కా, కాఫిఫల
హారముటికె టకెట్టని మొరలిడగా కూర్చోకుర్చో బండి
వెడలున్ ॥

2. మేల్‌లోకల్ గూడ్సు మేక్సైడ్, ప్యాలన్ ప్యాలన్ బేర్ బేర్
కాలము సరిగా స్టేషనులో చేరివిడచెను జనులను ॥

3. టనేట్ట నేరని గంటివ్వగను ఒహోబండి మొరలిడుచున్
పచ్చని జండాకనుబడగాన్ చెట్టన బండినిలుబడెను.

4. కుయ్యో మొర్రో నాబండి తప్పె - అయ్యో సామాన్
ముందుపోయె నయామ్ స్టేషన్ దొర వినియు రాకూడ
దనియు చెప్పెన్ ॥

"ఒరే దానీ! ఆ మామిడికాయలెందుకు దీసికొలేదురా! దగ్గరెవరును లేదుగా?"

అవును అక్కడెవరును లేకపోలేదు నేనుంటిగా, అట్టి నీచమైన కార్యమును నేను చేయుటను చూచుకొనలేను.



# అంటు జబ్బులు

తడపర, స్ఫోటకము మొదలైనవి అంటు జబ్బులని నీకు దెలియును గదా. నీకు తడపర బోసినపుడుగాని కోరింద దగ్గు వచ్చినప్పుడుగాని, దాని నితరులకంటించుటకు కోరవు గదా. ఇవి గాక వేరేవికూడ ఉన్నవి. చిరాకులు కోపపడుట, కూడా అంటుకొనును. ఒకరు ఇతరుల కనేకుల కివి అంటించ వచ్చును. నీ కివి కలిగినప్పుడు నీవు నెమ్మదిపడి సంతోషముగా నుండువర కితరుల జోలికిపోకుము.

మంచితనము, ఆనందము ప్రేమ మొదలైనవి కూడా అంటుకొనునవే. వీనిని సాధ్యమైనంతవర కితరులకంటించ ప్రయత్నించవలసినవి.

మనము దేవునితో నెంతగా మాటలాడెదమో, అంత ఎక్కువగా నాయనను గూర్చి మాటలాడుదుము.

ఒకడు పనినిచేయుటలో వాని ప్రవర్తనయందు "అయితే" 'గాని' అనునట్టి వాని నుపయోగింపకూడదు. "యోగ్యతశ్రేష్ఠమైనవిషయము" అను సూత్రము ఒకని ప్రవర్తనయందు గనుపడనియెడల అది నిరర్థకమైనదని జెప్పవలసియున్నది.

ఒకని యోగ్యతయు, వాని మంచితనమును వానిప్రవర్తనవలన దెలియును. సంభాషణలోను, సరకులనుగూర్చి చెప్పుట యందును సత్యసంధత్వముండును. వాని పనులన్నిటిలో నీతి న్యాయములుండును.



# బాలమిత్ర టపా

ప్రియబాలమిత్రులారా!

## నీతి కథ

ఒక దేశములో ఒక భాగ్యవంతుడున్న, అన్ని స్థితులను కలిగిన ఒకగొప్ప అధికారి ఉండెను. ఆ అధికారికి ఒక్కడే కుమారుడు. ఆ పిల్లవానిని తల్లిదండ్రులు బహు ప్రేమతో పెంచుచుండిరి. కొన్ని సంవత్సరములకు తల్లి దండ్రులు వానిని మెడికల్ కాలేజిలో చదువవేసిరి. ఈ భాగ్యవంతునకు చాలామంది బంధువులుండిరి. పిల్లవాని చదువు పూర్తియైన తరువాత యికనేను ఎక్కడ పనిచేయ




వలెనా అని ఆలోచించుచుండెను. ఎక్కడైతే అవసరమో అక్కడ పనిచేయవలెనని తన మనస్సునందు తోచెను. గనుక తాను తల్లిదండ్రుల యొద్దనుండి కొంతడబ్బును తీసికొని ప్రయాణమై హిమాలయ పర్వతములలో చీలిన ఒకశాఖ యందు నివసించుచుండెను. ఆ డాక్టరు కొన్ని కుక్కలను పెంచెను. ఆ కుక్కలు బలము కలిగినవి, మంచి రోమములుకలిగి నటువంటి కుక్కలు. హిమాలయ పర్వతములమీద మంచు విశేషము. మనుష్యులు ప్రయాణముచేయుచుండగా మంచులో

దిగబడి పోవుదురు. ప్రతికుక్కకు ఒక పెట్టెదాని ఆహారము. అప్పుడు ఈ కుక్కలు ఆ పెట్టెలను తమయొక్క మెడలకు తగిలించుకొని మంచులో దిగబడిన మనుష్యులను ప్రతిదినమున్ను ప్రతికుక్క అనేకమందిని రక్షించుచున్నది. ఆ డాక్టరుగారు 20 సంవత్సరముల ఈడుగలవాడై యున్నప్పుడు తల్లిదండ్రులను, బంధువులను, స్నేహితులను చూడవలెనని బయలుదేరెను. ముందుగా తల్లిదండ్రులకు ఫలాని తారీఖున ఫలానరోజున ఇన్నో గంటకు వచ్చెదనని టెలిగ్రాపు యిచ్చెను. గనుక తల్లిదండ్రులు చాలా సంతోషముతో ఉండిరి. ఇతడు పడవలో లేక స్టీమరులో ప్రయాణము చేయుచుండెను. ఆ స్టీమరులో చాలామంది భాగ్యవంతులుండిరి. ఆ కుక్కలు ప్రతిదినము పనిచేయుచున్నవి. ఆ డాక్టరు వచ్చుచుండగా కొన్ని చిన్నచిన్నపడవలకు జెండాలుకట్టి వాటిమీద ఈలాగు వ్రాయబడియున్నది.

"నశించి పోవుచున్న మమ్ములను రక్షించుడి"

మరికొన్ని పడవలమీద ఈ ముందుఉండు ఊరిలో రక్తవిరోచనములద్వారా అనేకమంది నశించిపోవుచున్నారు. గనుక మమ్ములను రక్షించుడు ఆ యూరిదగ్గరకు ఈ స్టీమరు వచ్చిన తరువాత 15,000 వేలమంది 10 వేలమంది చనిపోయియున్నారు. ఈ డాక్టరు ఆ గ్రామములోనికి పోవుటకు పూనుకొనియున్న

ప్పుడు మిగిలినవారు మిమ్ము గొనిపోతె చనిపోదురని చెప్పితే ఆ డాక్టరు నా ప్రాణములు పోయినప్పటికిని మరేమి భయము లేదు అని చెప్పి ఆ పట్టణమునకుపోయి రోగమును ఆపి వేసెను. చివరకు ఆ వ్యాధి ఇతనికి అంటుకొనెను. పడవ డానకు సత్తువలేకుండెను. తల్లిదండ్రులు బంధువులు స్నేహి తులు అందరును ఆ రేవుదగ్గరకు వచ్చియుండిరి. ఇక ఈ స్టీమరు 10 గంటలలో రేవుదగ్గరకు వెళ్లవలెను ఆ స్టీమరు వచ్చుచుండెను. ఆయన దీనిలోనే వచ్చుచున్నాడని అందరు చప్పట్లుకొట్టిరిగాని ఇంకా 10 నిమిషములకు రేవునకు సమీ పమున వచ్చియుండగ, అతను పంచత్వము నొందెనని తెలి సెను అందరు ఏడ్చిరి. ఆ పడవ రేవునకు వచ్చెను. అప్పుడు వారు ఆయనను ఇంటికి తీసికొనిపోయి సమాధిచేసిరిగాని కుక్కలు ఇంకను పనిచేయుచు దినమునకు చాలామందిని రక్షించుచున్నవి. క్రీస్తుద్వారాకూడ మన పాపములకొరకు తనయొక్క ప్రాణమును ధారబోసియున్నాడు. యేసును సమాధిచేసిరి గాని ఈ లోకములో ఆయన వెళ్లిపోయిన తరువాత కుక్కలు మిగిలియున్నవి. ఆ కుక్కలు ఎంతోకష్టపడి అనేకమందిని రక్షించినవి. ఆ కుక్కలు ఎవరనగా బోధించెవారే. డాక్టరు ఇతరులకొరకు తన ప్రాణమును ధారపెట్టియున్నాడుగాని కుక్క ఇప్పటివరకు ఆ పర్వతములలో పనిచేయుచున్నవి.

ఆలాగున మనము ఇతరులకొరకు సహాయము చేయవలెను.

మనమింకా పాపులమైయుండగా క్రీస్తు మనకొరకు చని పోయెను. రోమ 5 అ. 11 వ. ఒకని భారము నొకడు భరించి ఈలాగు క్రీస్తు విషయమును పూర్తిగా నెరవేర్చుడీ.

ఇట్లు

మీ ప్రియ బాలమిత్రుడు

జి. జయరావు

గొట్టిపాడు

గుంటూరు తాలూకా



C. L. S. PRESS, MADRAS—1919